# మన ఆరాధ్యప్రముఖులు...

# మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు



మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు సుప్రసిద్ధ తెలుగు చారిత్రక పరిశోధకులు, పురాలిపి శాస్త్రజ్ఞులు. విజ్ఞాన సర్వస్వం ద్వారా వెలుగులోనికి వచ్చిన శర్మగారు పశ్చిమ గోదావరి జిల్లా,

పోడూరు మండలంలోని మినిమించిలిపాడులో డిసెంబరు 9 వ తేదిన శ్రీమతి నాగమ్మ, భద్రయ్య గార్లకు 1891లో జన్మించారు. ఈయన గృహ నామమైన మల్లంపల్లి అనే గ్రామం తెలంగాణలోని "పాలకుర్తి"కి "బమ్మెర"కు సమీపమున నున్న గ్రామం లేదా ములుగు సమీపాన నేటికీ గల మల్లంపల్లి గ్రామం. కాకతీయ పతనానంతరం శర్మ గారి పూర్వీకులు అక్కడ నుంచి గోదావరి మండలానికి తరలి వచ్చారని తెలుస్తుంది. సోమశేఖర శర్మగారు డిగ్రీలు లేని పండితుడే అయినా నాటికీ నేటికీ ఆంధ్ర చరిత్రకారుల్లో అగ్ర తాంబూలానికి అర్హత సాధించిన పరిశోధక శిఖామణి. సాహిత్యరంగంలోను, రాజకీయ రంగంలోను ప్రసిద్ధి గాంచాడు. బిపిన్ చంద్రపాల్ ప్రసంగాల ప్రభావం ఈయన మీద ఉండటం వల్ల రాజమహేంద్రవరంలో విద్యార్థులు వందేమాతర ఉద్యమం చేపట్టాడు.

అప్పటి సాంస్కృతిక కేంద్రమైన రాజమండ్రిలో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడై పాత్రికేయునిగా తన సారస్వత జీవితం ప్రారంభించాడు. కథలు, నాటకాలు, నవలలు, పద్యాలు వివిధ పత్రికలలో ప్రచురించాడు. తరువాత శర్మ కార్యాచరణ స్థానం అప్పటి రాష్ట్ర రాజధాని మద్రాసు నగరానికి మారింది. ఆరోజులలో చరిత్ర చతురాననుడుగా ప్రసిద్ధి చెందిన చిలుకూరి వీరభద్రరావుతో శర్మకు పరిచయమైంది. అతనికి సాయంగా ప్రాచీన కావ్యాలకు, శాసనాలకు ప్రతులు వ్రాశాడు. అనంతరం విజ్ఞాన సర్వస్వం కృషిలో కొమర్రాజు వెంకట లక్ష్మణరావు, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, ఆచంట లక్ష్మీపతి, రాయప్రోలు సుబ్బారావు వంటివారులకు తోడు నిలచి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం నిర్మాతలలో ఒకడైనాడు.

శాసనములను ప్రకతించుటయందు ముఖ్యముగ వారి నిదానము, పాఠనిర్ణయము, సంపూర్ణమైన చక్కని వ్యాఖ్య ప్రతి శాసన పరిశోధకుడును నేర్వవలసియున్నది. తొందరపాటు అనునదే వారెరుగరు. పాఠ నిర్ణయమున తుదకొక్క అక్షర విషయమున చిన్న మార్పును సుచించినవారినైనా పెద్దగా ప్రశంసించుట వారికలవాటు. కేవలము '''భారతి'''లో వారు ప్రకటించిన శాసనములు సుమారు 30; ఎపిగ్రాఫియా ఇండికాలోనివి 4-ఆంధ్రపత్రిక రజితోత్సవ సంపుటములు, తెలంగాణా శాసనములు ప్రకటించియున్నారు.

ఆంధ్ర దేశానికి సంబంధించిన ముఖ్య శాసనములు కొన్ని ఆంగ్లములో ఇత్రరత్రా ప్రకటించినప్పుడు వాటిని ఆయా వ్యాసకర్తల పేరనే మరల భారతిలో చక్కగా సంస్కరించి ఆంధ్రావనికంద జేయుచుండెడివారు. శాసన పరిశోధనలో ప్రకటించిన శాసనముల సంఖ్య ముఖ్యముకాదు; వానిపాఠనిర్ణయము, వ్యాఖ్య ముఖ్యముగ గమనించదగినవి. శర్మ గారు వ్యాఖ్యలే అందుకు నిదర్శనములు.

శాసనములను ప్రకతించుటయందు ముఖ్యముగ వారి నిదానము, పాఠనిర్ణయము, సంపూర్ణమైన చక్కని వ్యాఖ్య ప్రతి శాసన పరిశోధకుడును నేర్వవలసియున్నది. తొందరపాటు అనునదే వారెరుగరు. పాఠ నిర్ణయమున తుదకొక్క అక్షర విషయమున చిన్న మార్పును సుచించినవారినైనా పెద్దగా ప్రశంసించుట వారికలవాటు. కేవలము '''భారతి'''లో వారు ప్రకటించిన శాసనములు సుమారు 30; ఎపిగ్రాఫియా ఇండికాలోనివి 4-ఆంధ్రపత్రిక రజితోత్సవ సంపుటములు, తెలంగాణా శాసనములు ప్రకటించియున్నారు.

ఆంధ్ర దేశానికి సంబంధించిన ముఖ్య శాసనములు కొన్ని ఆంగ్లములో ఇత్రరత్రా ప్రకటించినప్పుడు వాటిని ఆయా వ్యాసకర్తల పేరనే మరల భారతిలో చక్కగా సంస్కరించి ఆంధ్రావనికంద జేయుచుండెడివారు. శాసన పరిశోధనలో ప్రకటించిన శాసనముల సంఖ్య ముఖ్యముకాదు; వానిపాఠనిర్ణయము, వ్యాఖ్య ముఖ్యముగ గమనించదగినవి. శర్మ గారు వ్యాఖ్యలే అందుకు నిదర్శనము